'వెళ్ళిరావలసింది. కథంతా అర్థమయేది—' చేత్తో చిన్న పూచికపుల్లను విరిచి పళ్లుకుట్టుకుంటూ నసిగాడు కుర్చీతోసహా వెనక్కి నడుం విరుచుకుంటూ.

'హాఁ, హాఁ—ఏదో వుంది.' అన్నారు ముసలాయన.

పూచికపుల్లతో గాలిలో వూచిస్తూ 'ఇప్పుడేం లాభం అనుకుని—అటువంటి సంబంధం చేశాక—'

ముసలాయన ఒక్కమాటు బుజాల్ని దులుపుకుని చేతిలోని కర్రను కుర్చీవెనుక వ్రేలాడేస్తూ— 'ముసలాడి కబుర్లు నీకు పచ్చిపచ్చిగా వుంటాయి గాని, యీ తల పూర్తిగా పండేదాకా నౌకరీ చేశానా, దేశం కాని దేశం అక్కడా యిక్కడా వుంటూ వచ్చానా, ఎన్నిరకాల మనుష్యుల్ని చూడలేదు? అంతా ఒక్కలా వుండరు. అదలా వుంచు. ఎప్పుడూ మనమే నెగ్గాలనుకునే మన స్తత్వంకల మనుష్యుల్ని చూశాను. కొన్ని సందర్భాల్లో గెలుస్తూ మళ్ళీ వోడుతూ జీవితం సాగించే వ్యక్తుల్ని చూశాను. పట్టూ విడుపూ అన్నదుండాలి. అదిలేని వ్యక్తుల్లో అందులో హమేశా మనమే ముందుండాలి మనమాటే నెగ్గాలి అనుకునేవాళ్ళతో జీవించటం ప్రమాదకరం. మీ అమ్మవుందా — అది కాపురానికొచ్చిన క్రొత్తల్లో పట్టి అడివిగొడ్డు. మొరాయించటం కరవటం వుండేది కాదు. ఆఖరికి నాకు తెలియకుండా అణా అర్ధాతీసి యే పోపులపెట్ట్యాలోనన్నా జేరేసి ఒక పదిరూపాయలు చేస్తుందేమో అని చూశాను, ఆ తెలివితేటలుకూడా లేవు. కాని అట్లాటి మనిషితో కాపురం నాకేమీ కష్టమనిపించలేదు. కాని మళ్లీ మీ చిన్నత్త— దగ్గిపోయిందిలే, నువుపుట్టాక. అంచేత తెలీదు. ఆవిడ మొగుణ్ణి రాచి రంపాన పెట్టేదని వలుగురూ అనుకునేవారు. నాకేం మొహమాటం లేదు. అడిగేద్దామా అన్నంతవరకూ వచ్చింది. కాని చూస్తూ చూస్తూ అడబిడ్డను నేనేమన్నా. ఒకమాటు దాన్ని పుట్టింటికి తీసుకరమ్మంటే నేనే బయల్దేరి వెళ్లాను. గుమ్మంప్రక్కనే స్కూలు. ఆ బడిపిల్లలు కిటికీదగ్గరకువస్తే పల్లంలో వీళ్ళ దొడ్లో అంతా కనబడ్తుంది. అప్పుడు వాళ్ళేదో అంటున్నారు. ఇది వాళ్ళను చెరిగేస్తోంది తిట్లతో. ఏమిటే ఆ పిల్లలు అంటున్నది అని అడిగాను రావటంతో. దానికి నామీద కూడా కోపమొచ్చింది. తరువాత తెలిసింది 'అయినకాడికి అణాపరక—' అని పిల్లలు పిలుస్తారని. బజారుకి ఆ వూళ్లో పనిమీద బయలుదేరితే ఏ గోడమీద చూసినా అయినకాడికి అణాపరకా. ఒక గుంటవెధవని పిలిచి 'ఏంరా—ఆమాట' అన్నాను. వాడు నవ్వుతూ పరుగెత్తుకుపోయాడు. నేను స్వతహా కొంటిమనిషిని—ఆరోజు దీపాలుపెట్టాక దార్లో ఎదురైతే 'ఏమిటి బావా—అయినకాడికి అణాపరక అని రాసుంది మీ యింటిమీద—' అని ఖర్మంజాలక నోటజారాను. అగ్గిరుద్రుడయాడు. ఎట్లాగో తెలుసుకున్నాను. ఒకరోజున వుదయం 8 గంటలకు బజారుకని బయల్దేరి, ఏదో ఒక తోటకూరకట్ట కొనివి పచ్చిమిరపకాయలతో అఘగుపెట్టాట్ట యింట్లో. స్కూల్లో ఒకటికి గెల్లుకొట్టారు. అప్పుడు మీ చిన్నత్త చింతకుప్పలాటి తలేసుకుని తడిసిన చీరతో వురుముకుంటూవచ్చి 'ఏమిటి తగలేశావు?' అందిట. 'ఫలానా—' అన్నాక 'ఎంతయింది?' అని గర్జించిందిట. 'అణాపరక—' అన్నాక ఆలస్యమయిందని శాపనార్థాలు పెడుతూ 'ఇంతేనా అయినకాడికి అణాపరక' అంటూండగా స్కూలు పిల్లలువిని ఆ ముక్క పుచ్చుకున్నారు.

ఇంత కథా నీ కెందుకు చెప్పానంటే, ఆవిడ పోలికే అచ్చంగా మన సరస్వతి.'

ప్రసాదరావు రూక్షంగా—'మీ కసలు ఏం తెలీదు. మీరు దానికి చాలా అన్యాయం చేశారని వేదనలో వున్నందుకు ముందుగా యింత చరిత్ర చెప్పుకొచ్చారు. నాకు తెలుసు నాన్నా—ఇంకా ఏం కావాలి? నిల్చున్నపాళాన చంటిబిడ్డతో యింట్లోంచి పొమ్మని అన్న మనిషికి ఏపాటి సంస్కారం వుంటుందనుకునేది?'

'అతనలాటి మనిషి కాడు.' ముసలాయన సమర్థిస్తూ గట్టిగా అన్నారు.

ప్రసాదరావు క్షణంసేపు లేచి నిలబడి పరుషంగా—'మీరు చేసింది తప్పుకాదని సమర్థించుకోవటం కోసమే చూస్తున్నారు గాని మన గౌరవం ఏమాత్రం అతగాడు నిలబెట్టాడో ఆ విషయం ఆలోచించటం లేదు.'

ముసలాయన యీలోగా 'అమ్మీ కొంచెం 'టీ' పట్రా. సుపుత్రుడు దేవతలకు పంచాంగాలు

చెబుతున్నాడు.' అనేసి 'కూర్చోరా నాన్నా— కూర్చో...' అని ప్రసాదరావు నుద్దేశించి అన్నారు.

ప్రసాదరావుకు వోటమి యిష్టం లేదు. ఆయన వాదించి తనచేత అవునని పిస్తారనే భయం లేకపో లేదు లోపల. అదికాక స్వయానా కూతురి విష యంలో ఆయన అల్లుడిపక్షం తీసుకోబోవటం చూస్తే తనకే ఎల్లానో కచ్చగావుంది. అందుచేతే లేచి తప్పు కుపోవాలని చూశాడు.

ముసలాయన అన్నారు.

'ఈ ఒక్కమాట విను. నీకు తెలిసింది, చాలా మంది అనుకునేది మనుష్యులంతా డబ్బుగలవాళ్ళు, లేనివాళ్లనే. ఈ రెంటి మధ్యా సంబంధబాంధవ్యాలు పొసగవనే. పైగా యీ విభజనలో తప్పుందంటాను నేను. మనుష్యుల్ని తత్వాలవారీగా విభజించి పరీ క్షించాలంటాను. శాస్త్రిని నేను అట్లానే కొల్చి చూశాను. అతను యితరులకు కష్టం గలిగించడు. ఇత రులు తనకు కలిగిస్తే ఓపికతో సహించి వూరుకుం టాడు. బస్. యిక నీవు వెళ్లొచ్చు.'

'మరి యీ జరిగిన రాద్ధాంత సిద్ధాంతాలన్నీ '

'ఏ రాద్ధాంత సిద్ధాంతాలు...?'

'ఇదిగో ప్రత్యక్షంగా కనబడుతున్నదే పుట్టిం టికి తోలెయ్యటం—'

'హాఁ! అదా - ఏదో మాటామాటా వస్తే అమ్మాయే వచ్చేసుండచ్చు. మన బంగారమే మంచి దని అస్తమానూ అనుకోవటం తప్పురా. ఎదటివాడి కంట్లో దూలం వెతికేముందు మన కంట్లో నలుసు అఘోరించిందేమో చూసుకోవద్దూ.'

'చూసుకోవాలి—' అని కోపంగా అనేసి ప్రసాదరావు దరదరా వీధిలోకి నడిచాడు. సరిగా అదే సమయానికి ప్రక్కగదిలోనే వుండి యావత్తూ కాకపోయినా కొంత కొంత విన్న ప్రసాదరావు తల్లి యివతలకు వస్తూ—'ఇంకా కొంపలో అడుగుపెట్టి పది నిమిషాలు కాలేదు. ఏవిటి వాడివల్లా వెర్రెక్కు తున్నారు? ఏదో మర్యాదగా వచ్చాం—నాల్రోజు లుండి మర్యాదగా వెళ్ళాలని లేదా మీకు?'

'హుఁష్. వూరుకోవే—తెలుసునంటూ వచ్చావు నడాన. నేను ధర్మంకోసం పాటుపడుతాను. ఎప్పుడు ఎక్కడెక్కడ ధర్మం నశిస్తుందో అక్కడల్లా పుట్టు కొస్తానని కృష్ణపరమాత్మ చెప్పలే. గీతల్లో...'

'ఓహో - యిదే కామోసు ఆ అవతారం. చాల్లెండి. అనవసరంగా పిల్లల మనస్సులు నొచ్చు తాయి. వాళ్ళేం అజ్ఞానులు కారు. ఎవళ్ళ వాళ్ళంత. వాళ్లు వాళ్ళయారు. మీ దూరికే నోటికొచ్చి నట్లల్లా......'

'నువ్వు ఫో—ముందు అవతలకి...' ముసలా యన గర్జించారు. మధ్యలో కోడలు వచ్చి-'మావయ్య గారూ మీకు పోర్టీను తెచ్చేదా......' అని సమా ధానంకోసం నిలబడ్డది.

'ఏవి మర్యాద? ఏవి మర్యాద? మాకు పిల్ల లంటే అలా వుండాలి.' ఆవిడకు వినిపించలేదు ఆ మాటలు. మళ్ళీ అందుకుంది.

'ఐతే మీరు ఏవిటి అమ్మాయిని దాన్ని కొత్త పలకరించారూ?' ఆయన ముఖం కంచించుకుని 'పోదూ—నీ తెలివికి సంతోషిస్తున్నాను. నేను ఆ విషయం ఎత్తితే అది చిన్నబుచ్చుకుని ఏడవదూ—'

ఇంతలో పోర్టీను పుచ్చుకునివచ్చిన కోడలును పరామర్శగా 'మీ అమ్మ అంతా బాగున్నారా? బాబు లొస్తున్నారా?'

తల వూపుతూ కప్పును బల్లమీద వుంచి— 'అత్త య్యా...మీరు...' అంది. ఆవిడ అధికార పురస్సర మైన ధోరణిలో—'నాకేం అక్కర్లేదమ్మా. అబ్బ! అందులో ఏదో కోడిగుడ్డుసొన కూడా వేస్తారట. రామ! రామ! ఆ పోర్టీన్లూ అవీ అట్లాటి నూకరాలు బస్తీవాళ్లూ నాగరికులు మీకు గాని...'

ముసలాయన లేచారు. మీది పిల్కకండువాని ఎక్కడ తగిలించటమా అని యిటూ అటూ చూస్తున్న ఆయనకు ముసలావిడ మాటలు వినిపించాయి. చేతి లోని కండువాని అందుకోవటంకోసం వస్తున్న కోడల్ని ఉద్దేశించి—పద్యం చదివే ధోరణిలో 'రుచి పాకము నాలుకగా కెరుంగునే, తెడ్డది కూరలో కలియు' అని వూరికే అన్నాడు భాస్కరశతకకర్త.

ఆ అమ్మాయి కండువా వంకీని తగల్చటం కోసం అక్కడినుంచి నిష్క్రమించాక ఆవిడ యీ అన్న ముక్కలకు వూరుకోలేదు.

'పిల్లలదగ్గర అట్లా తీసిపారేస్తూవస్తే రేపంటే యేమన్నా చీమకొలంత గౌరవం వాళ్లకిక ఎందుకుంటుంది?'

'అందుకే అన్నారే_వెర్రిదానా—మొగుడు తిడితే మొగసాలవాడూ తిట్టాడని.'

'నాకు గౌరవం అనేది లేదని ఎల్లానూ తెలుసు. మీతో దీనికి గాని వాదన—అమ్మాయి సంగతి కొంత కనుక్కొండి మీరు వెళ్లటమో, అతగాడికి కబురు చెయ్యటమో—'

'ఏమని? నువ్వు కాస్త నోరు మూసుకుంటే అన్నీ అవుతాయి. కాశీనుంచి వచ్చేప్పుడు మాద్దాములే.'

'దారిలో పనిగదా—'

ముసలాయన క్రుద్ధుడై నిస్సాకారంగా—'ఇప్పుడు నావల్ల కాదు. వచ్చేటప్పుడు మాద్దామన్నానుగా.'

ఆవిడ ప్రక్కకు తిరిగి చెంగుతో కళ్లు నొత్తుకుంటూ బొంగురు చేసుకున్న గొంతుకతో 'అంతే దాని ఖర్మ. రేపు ప్రొద్దున్న నలుగురూ ఏమన్నా మీ అమ్మాయి యింకా యిక్కడే వుందేమంటే నేనేమని చెప్పేది? నలుగురూ నన్ను దుయ్యబట్టుకుంటారు గాని...'

ఆయన ఒక్కమారు లేచినిల్చొని—'చాల్చాలు యింకే అధికప్రసంగం చెయ్యకు. ముందు నువ్వే మా అమ్మాయిని పోదిలేశావని నలుగుర్లోనూ చాటొచ్చేటట్లున్నావు.'

'హవ్వ! రామ! రామ!' అనేసి ఆవిడ నెమ్మదిగా అక్కడ్నుంచి నిష్క్రమించేలోపున ఆయన నున్నటి తలను పదేపదే రాసుకుంటూ పచార్లకు ప్రారంభించారు. దూరంగా నేలమీదకు గంటన్నర క్రితమే వదలివేయబడ్డ మనవడు అక్కడే నిద్ర తీసి అప్పుడే లేచి మెడను రిక్కించి తాతగారి పచార్లను బుర్ర రాసుకోవటాన్ని పరిశీలనగా చూడసాగాడు. కాని అట్లా వాడు ఎంతోసేపు పెద్దమనిషి తరహా అభినయించలేదు. చరచరా మోకాళ్లతో ప్రాకి ఆయన అప్పటివరకూ కూర్చున్న కుర్చీముందు వుండే విరుసుకుచాప గుండ్రబల్ల క్రిందకు చేరి, అంతక్రితము ప్రసాదరావు వదిలి విసిరేసిన సిగరెట్టు పీకలను సునాయాసంగా ప్రోగుచేసి వాటితో ఆడుకోవటంలో నిమగ్నుడయాడు.

తాతగారు ఆలోచనామగ్నులై యిట్నుంచి అటూ అట్నుంచి యిటూ పోవట్టీను అరిగేదాకా పచార్లు చేశారు కాని బల్లక్రింద ఆడుకుంటున్న మనుమణ్ని పోల్చుకోలేకపోయారు.

ముసలావిడ వంటలోకి దిగింది. కోడలు బహుజాగ్రత్తతో మడిగట్టుకుని ఆవిడకు అదీయిదీ సరఫరా చేస్తున్నది. కాని యీ వ్యవహారంలో ఏమాత్రం హెచ్చుతగ్గులు వచ్చినా అత్తగారు సహించి వూరుకోరు—'నేను కాపురానికొచ్చిన క్రొత్తల్లో...' అంటూ ప్రారంభిస్తుంది.

ఇదివరకే అంతిమాత్రపుపని—సరస్వతి కిప్పుడు చేతినిండా తీరిక. గంటసేపు కూర్చుని తీరిగ్గా జడ అల్లుకున్నది. తరువాత తువ్వాలు సబ్బుపెట్టె పుచ్చుకుని స్నానాలగదిలోకి వెళ్లింది. అయ్యో యింత నిదానంగా పనులు చేసుకుంటూ కూర్చుంటే అవతల వంటా అదీ చూసుకోవాలి, యిల్లు చక్కబెట్టుకోవాలి అనటానికి యిది తన యిల్లుకాదు. ఈ పనులు పూర్తిచేసినకాలంలో అదించవలసిన ఆ బాధ్యత, అదీ తనకు లేదు.

అది చాలా చిన్నగది. ఒక ప్రక్కంతా పొగతో నల్లగా మసిబారిపోయింది. క్రిందగా ఒక పెద్ద పొయ్యిలో ధగధగా మండుతున్నవి నాలుగు పెద్దకట్టెలు. ఆపైన వెడల్పైన నల్లటి రాగిగాబు. అందులో రెండుబిందెలనీళ్లు ఏకధాటిన సలసలా మరుగుతాయి. కట్టెలు బాగా మండుతున్నవేమో, ఒక వైపునుంచి సెగలు వస్తూంటేగా, సరస్వతి తలుపులు బిగించి, కుర్చీపీటను లాక్కొని, అందుమీద ఒక కాలునుంచి పోసుకుంటూ నీళ్లు—మధ్యమధ్యను వొళ్లు రుద్దుకున్నచోటే మళ్ళీమళ్ళీ రుద్దుతూ గంటన్నరసేపు జలకమాడింది. అంతసేపూ తన వొళ్లు తాను చూసుకుంటూనే వుంది. చేతులు నీళ్లను పాళంగా తోలుపుతూనే వున్నాయి. స్నానం పూర్తవుతూనే వుంది. కాని మనస్సు మనస్సులో లేదు. ఇప్పుడు తన బ్రతుకు పరీక్ష తప్పిన కుర్రవాడి మోస్తరయింది.

అంత వేడినీరు శరీరంమీదుగా పరుగెడుతూన్నప్పుడు సరస్వతికి తన కాపురం - మొదటి దినాలు

సర్దుకొచ్చాయి. ఆ ఆలోచనలు గూడా 'సంబంధపు చర్యలు—' అట్నుంచి 'పెండ్లిమాపులు'— 'వీడా గొప్ప తారతమ్య వివరణ'—పలువురూ పలు విధాలుగా చేసిన సూచనలు, ఎల్లాగో అయిన పెండ్లి, మధుపర్కాలు, దండాడింపు అన్నీ చకచకా తిరిగిపోయాయి.

అటుతరువాత శాస్త్రిని గురించి తియ్యగా వూహించటానికి మొదలు పెట్టిన రోజునుంచి, అతడ్ని చూడగానే ఎవరో వెనుకనుంచి వచ్చి గిలిగింతలు పెట్టినంత వుత్సాహంతో పులకలెత్తిన తను—ఏరోజు కోసం యువతీ యువకులు రాత్రింబగళ్ళు వువ్విళ్లూరుతూ ఆలోచిస్తుంటారో, ఆ దినం—తను ఎట్లా వర్తించింది? ఏమేమి చేసింది ఒక్కమాటు గుర్తుకు తెచ్చుకోకుండా వుండలేకపోయింది సరస్వతి.

సరస్వతి కప్పటికి యింకా పదహారేళ్లు నిండలేదు. పోణీలు మానేసి కూడా ఏడాది పూర్తయిందో లేదో—యింటికి వచ్చిన అమ్మలక్కలంతా 'పిల్ల ఎత్తరి—మనిషవుతుంది.' అంటూంటే ఆ ముక్కలు బోధపడకపోయినా వాటివెనుక ఏదో తీయటికల వున్నట్లు అనిపించేది తన మటుక్కి. ఆ రోజుల్లో ఎంతసేపూ దృష్టి ముస్తాబుమీదే వుండేది.

పండగలకు పిల్చినప్పుడల్లా శాస్త్రి వస్తూండే వాడు. మొదటిసారి చెల్లెల్నికూడా వెంటబెట్టుకొస్తే, ఆ పిల్లను తాను ఎంత వేళాకోళం చేసిం—ఏదో వంకను ఆమె బట్టలనో అలవాట్లనో హేళనగా తీసి కట్టుగా విమర్శించినదీ, అవన్నీ గుర్తొస్తున్న కొద్దీ సరస్వతి యిప్పుడు విచారించకుండా వుండలేక పోతున్నది. ఒక్కలేని తనాన్ని మాత్రమే శాస్త్రి తను యెదుట విధిలేక ప్రదర్శించవలసి వచ్చినప్పుడు అతను బికారిలా వుంటాడని, మావగారివద్ద నుంచి వచ్చినప్పుడల్లా డబ్బు గుంజుకుపోవటమే ప్రధానాశయంగా పెట్టుకున్నాడని తనవారు ఆఖరికి తల్లికూడా ఆ నోటా ఆనోటా తనముందరే అంటూ వచ్చినప్పుడు అభిమానవతియైన మరొక స్త్రీ యేం చేసేది? తనుమాత్రం యువతిలాగట్టునే నిలబడి చేతుల్ని కట్టుకుని నలుగురూ తిరస్కారంగా అనుకునే మాటలకు వూతాన్ని యిస్తూ ఎంత ముభావం నటించలేదు? ఆరోజున అమ్మలక్కలు తాంబూలాలు తీసుకున్నాక కొంగున కాసు ముడివెయ్యలేదని, అంతమాత్రం లేకపోయిందా అన్న భావంతోనే తెల్లవార్లూ తలుపు వానుకునే నిలబడి పెడముఖంగా వుంటే అతనేమన్నాడు? పల్లెత్తుమాట అనకుండా గుప్ చిప్ గా మూడురోజులూ ఫైరులో కూర్చున్నట్లు గడిపి మళ్ళీ వచ్చాక తీసుకవెళ్తానని అనేసి దాటుకున్నాడు తనవారినుంచి. అవతలవాళ్లు తీసుకెళ్ళటంకోసం మనిషిని పంపినప్పుడుకూడా యేడ్చి యమలోకానికి పోతున్న దానిలా పెద్దపెద్ద రాగాలతో వెళ్లినప్పుడు స్టేషనులో అతను ఎదురువచ్చి ఎంతో మర్యాదగా యింటికి తీసుకవెళ్ళాకకూడా మూడు నెలలు తను ఎన్ని చేదు వుల నీళ్లు త్రాగించినా పైకి ఏమన్నా తేలాడా! అటువంటి శాస్త్రిని తిరిగి నలుగురూ కోతి అంటూండటాన్ని తను యీమాత్రం పరిజ్ఞానం వచ్చాక కూడా వింటూ సహించి ఎంతకాలం ఎట్లా వూరుకోగలదు? ఇప్పుడు పిచ్చివాడుకూడా అవుతాడేమోనని చెల్లాయి వ్రాసింది. ఎవరు కారణం! తనే. తనే. తనే. తన మూలకంగా అతను సర్వనాశన మవుతాడు.

వేగిపాలోని నీళ్లన్నీ కర్చుతూ యివతలకు వచ్చిన కూతుర్ని వుద్దేశించి—'ఎక్కడున్నావే యింత సేపూ స్నానమేనా...' అంది తల్లి.

'ఆఁ' అనేసి గడపదాటుతుండగా చంటివాడు ఆడుకుని వదిలేసిన గిలక్కాయి ఎర్రగా దృష్టిని పడ్డంతో సరస్వతికి ఒక్కమాటు వొళ్లు ఝల్లుమంది. 'పిల్లవాడు ఏమైనట్లు—'

చిన్నగుడ్డితోనే నాలుగు గదులూ అలంగం తిరిగి వంటయింట్లోని వదినగారివద్దకు వచ్చి తడబడుతూన్న గొంతుకతో 'వానిగా జేడి!' అంది.

ఆవిడ చెంబును క్రింద వుంచుతూ 'వాకిట్లో లేడా—యిందాక చూశానే...'

'ఏమోనమ్మా...' అంటూ మళ్లీ దొడ్డంతా కలయతిరిగింది.

పొయ్యిదగ్గర కూర్చొని సంతనాగా వండుతున్న ముసలావిడ పోపుకోసం మాడబెట్టిన తాళాల్ని యిటుకముక్కలతో గమ్మున దింపి 'అయ్యో నా కూతురా—ఎక్కడ వదిలేశావురా బిడ్డను—చప్పున వెతకండి. చప్పున వెతకండి.' అంటూ ముందరగా నూతి దగ్గరకు పరుగెత్తింది. తల్లి నూతిదగ్గరకు దారి తియ్యటంతో తొందరలు పడి సరస్వతి గుడ్లనీరు గ్రుక్కుకుంటూ అనుసరించసాగింది.

ఆశ్చర్యంగా వుందే—' అంటూ వదినగారు యిల్లంతా చుట్టివచ్చి, అంతక్రితమే పచార్లను ముగించి ముఖ్యగదిలో నరసారావుపేట కుర్చీలో పరుండి అర్ధనిమీలిత నేత్రాలతో ఆలోచిస్తున్న ముసలాయన్ను అడిగింది– 'పిల్లవాడ్ని ఎక్కడైనా చూశారా' అంటూ.

ఆయన హఠాత్తుగా విన్నారేమో ఆ లేవటంలో టప్పుమని ముక్కుమీదనుంచి కళ్ళజోడు జారి గచ్చుమీద పడి బ్రద్దలయింది. కోడలు ఆ ముక్కల్ని ఏరటంకోసం నేలను వంగినప్పుడు టీపాయిక్రింద చేరి ఆడుకొని అలసి నిద్రపోతున్న పిల్లకుంక ఒక మూలను సాక్షాత్కరించాడు.

'ఇదుగోనర్రా యిక్కడున్నాడు—'

గుమ్మందాకా నడిచి ఎండలోకి గాబరాగా చూస్తున్న ముసలాయన 'యేడి యేడి' అంటూ వచ్చి 'అమ్మదొంగా – యిందాక నేనే అబ్బాయితో మాట్లాడుతూ మాట్లాడుతూ నేలకు వదిలేస్తే దీని క్రిందకు జేరాడు గావును.' అని పూర్తిచేశారు.

ఎరుపెక్కి ధారలుగట్టిన కన్నీళ్ళతో తడిసిన సరస్వతి ముఖాన్ని చూడగానే తండ్రి హృదయం చప్పున కరిగి—'యిదుగోనమ్మా—' అంటూ అందిచ్చిన చేతుల్తో తలమీద నెమ్మదిగా నిమిరి 'ఎంత గాబరా పెట్టేశాడో యింటిల్లపాదినీ వీడు. అమ్మ ముండా! కళ్ళజోడుకూడా విరిగిందిరా నీమూలాన.'

మాటలో అడ్డువస్తూ అమ్మమ్మ—'ముండా గిండా అనకండి వాడిని – వాడికి మీ పేరే పెట్టారు కూడా.'

సరస్వతి చెంగుతో నీళ్ళు వొత్తుకుంటూ పిల్లవాడ్ని తీసుకుని వెళ్ళబోతోంది. గొంతు సవరించుకుని అన్నారు తండ్రి—'ఏమే అమ్మాయీ మాతో కాశీ వస్తావా—యాత్రలు చేసొద్దుగాని.'

మడిలో వున్న పెద్దావిడ నోరు నొక్కుకుంటూ—'దాన్నెందుకండి కాశీ ప్రయాణం చేస్తారు?' అంటూ అడ్డుపుల్ల విసిరింది.

'అది కాదే విధవా—ఏమున్నా పాపాలు చేసుంటే అవన్నీ గంగలో కడిగేసుకోటానికి.'

'అది కుర్రపిల్ల—దానివల్ల ఏమే పాపాలు జరిగుంటాయని—'

'ఏమే పాపాలా - మొగుళ్ళను యేడిపిస్తే వచ్చే పాపాలు.'

'చాల్లెండి. ఎవరైనా వింటే నవ్విపోతారు?'

'అయ్యో ఖర్మవా—అస్తమానూ ఎవరో వింటారు. ఎవరో ఏదో అంటారు అని ఎవరికోసమో బ్రతుకుతున్నట్లు ఆఘోరిస్తా వేమిటి? మీ ఆడజాతి చేసే ఘోరాల్లో భర్తలను క్షోభపెట్టి అలోలక్ష్మణా మనేట్లు చెయ్యటంవుందే—దానికోసం కాశీ వస్తే జీవితంలో ఒకమాటు మంచిదంటాను నేను.'

'మరి మీరెందుకు అయితే—'

'అల్లా అడుగు లెక్క చెబుతాను. మీరు చేసే దరిద్రగొట్టు పనులన్నిటికీ చిత్రగుప్తుని దగ్గర జవాబుదారీ వహించేది మేము. అంటే మేం చేసుకున్న పుణ్యమేదన్నా వుంటే అది కాస్తా మీమూలంగా బ్యాంకులో డబ్బులాగా హరించిపోకుండా వుండేందుకు.'

'అయ్యబాబో—మీరు దేముడితో కూడా గీచి గీచి బేరమాడేటట్లున్నారు పాపపుణ్యాల విషయంలో.'

'బేరమా—నా ఎదురుగుండా వచ్చి నిలబడితే భగవంతుణ్ణి కూడా లెక్కల్లోకి గుణింతాల్లోకి దించి చివరకు కొసరు వేయించుకుంటాను. రాధే శ్యామ్. రాధే శ్యామ్. వెళ్ళండి వెళ్ళండి. నా కళ్ళజోడు ఆయువు మట్టం కావటానికొచ్చింది యీ హడావిడి. లేకపోతే విక్షేపంలా యింట్లో వున్న బిడ్డడికోసం— ఒకరు వీధిలోకి ఒకరు నూతిలోకి పరుగులుచ్చుకున్నారు. ఛీ! ఛీ!'

సరస్వతి యీ సందట్లో నెమ్మదిగా జారుకుని మరో చీర మార్చి పిల్లడికి పాలు గ్రాపట్టి చాప పరుచుకుని నెమ్మదిగా చిన్న కునుకు తీయటానికారంభించింది. ఆ పసివెధవ కాళ్ళను తపాతపా కొడ్తూ కేకలు పెడ్తూ కేరింతలు గొడ్తున్నాడు.

ఆ రోజు రాత్రి వున్నట్లుండి సరస్వతి హఠాత్తుగా ఒక నిశ్చయానికొచ్చేసింది. తెల్లవారి లేచాక ఎందరు చెప్పినా వినలేదు. ఎదురు మాట్లాడిన వారందరితో చెడామడా తిగూలా జేసింది. ప్రసాదరావు అధికారంకూడా పని చెయ్యలేదు. బలవంతాన తండ్రి జేబులోని పర్సు లాక్కుని పది రూపాయలు చేత్తో

పుచ్చుకుని నే నివ్వాళే వెళ్తానని మంకుపట్టు పట్టి ప్రయాణమయింది. ముసలాయన తప్పనిసరిగా స్టేషనుకు వెళ్ళి టిక్కెట్టు కొనియిచ్చి వచ్చారు. ఆ రాత్రి వదిన 'నేను చెప్పానా మీ చెల్లెలు కోతి—' అని భర్తను గేలిచేసింది నవ్వుతూ.

## 5

సాయంత్రం ఎర్రబడ్డది. సరస్వతి ముఖాన కూడా, కాకే చెమటలకు అంటుకుపోయిన కుంకుమ రక్తిమను, చూసి కూడా చూపినట్లు తిప్పకు నిల్చున్నాడు శాస్త్రి.

మళ్లీ పజ్జబుట్ట—మరచెంబు, ప్లాస్కు ట్రంకు పెట్టె ఒక్కటొక్కటే రిక్షావాలా తెచ్చి యింట్లో పడేస్తున్నాడు.

వెలిగిస్తున్న బుడ్డి దీపాన్ని గోడనున్న మేకుకు చేర్చి మసకచీకట్లో 'ఎవరన్నయ్యా—' అంటూ వచ్చింది చెల్లాయి.

క్షణంసేపు మాట్లాడకుండా చూస్తూ నిలబడ్డ మానవాకారం నిశ్శబ్దంగా అక్కడనుంచి నిష్క్రమించింది.

సరస్వతి పోల్చుకో: పోలేదు. బికారిలా పెంచిన గడ్డంతో నల్లటి మురికితుండు నొకదాన్ని చుట్టుకుని స్తంభంవారనుంచి మిడిగుడ్లు పెట్టుకుని చూస్తున్నది ఆ మనిషే—అతిగా దేవని.

సరస్వతి చంకనుండి పసికుంక నేలకు జారబోతున్నాడు. చెల్లాయి చప్పున అందుకుంటూ '—నువ్వా వదినా—యిల్లు ఎటా పోల్చుకున్నావు?'

సరస్వతి కొంగునున్న ముడివిప్పి మూడు పావలా కాసులు యివ్వబోయింది. రిక్షావాడు తలను పంకిస్తూ 'ఏం దమ్మగోరూ—అయీది కాదని యీ యీది, యీ యీదికాదని అదీ పూరు సంగానికి తిప్పిస్తివే — మువ్వావులా డబ్బులేనా, రూపాయన్నర బేరం. నా నుచ్చుగోనంటె వుచ్చుగోను.'

సరస్వతి నీరసంగా—'అంతే—నాదగ్గర అంతకన్నా లేదు. వెళ్లు వెళ్లు. ఇచ్చిన డబ్బుల్తో తృప్తి లేకపోయాక, అందుకనే మీకు కూడూ గుడ్డా వుండదు.'

ఇచ్చిన మువ్వావులాను గడపమీద వుంచి—'అమ్మగోరూ—నాకాడ తిరకాసు పనికిరాదండీ. మీ డబ్బులు మీరు యిచ్చేస్తేనే సంగోరు దక్కుతుంది.'

అంతసేపూ కావడి బుజాన్నేసుకుని సందుమార్గాన నీళ్ళను తెచ్చి జేరవేస్తున్న శాస్త్రి ఎదురురొమ్ము ముచ్చెమటలు కారుతూండగా కావడిబద్దను పుచ్చుకుని నేలను పొడుచుకుంటూ 'ఎవరి సంగోరురా దక్కింది?' అని పళ్ళు పటపటా పిండి వురిమినట్లు చూశాడు. అంతవరకు — యింట్లో మగవాళ్లు కూడా వున్నారనే జ్ఞానంతో లేని రిక్షావాలా 'ఇసుమంటి బేరాలు నొంకుతిగిల్తే నోజుకి నా సామిరంగా! గంజిమెతుకులు కూడా పోవునోపలికి' అని నెమ్మదిగా తోక ముడిచాడు.

'ఇదిగో మంచినీళ్లు వదినా—'

సరస్వతి గుటగుటా రెండు చెంబులెత్తి నోట్లో పోసుకుని—

'అమ్మయ్య'—అనుకున్నాక—'ఇప్పుడు నీ వంట్లో ఎట్లాగుంది?'

'ఫరవాలేదు. ఇంటికి వెళ్ళమన్నారు. మంగళ వారం శుక్రవారం రిక్షామీద వెళ్లి యింజక్షనులు తీసుకుంటున్నాను.'

చెల్లాయి చంకలోని కుర్రకుంక నెమ్మదిగా బాకాపట్టి యేడుపుకు లంకించుకున్నాడు.

'పాలు కలపాలి కాపోసు వీడికి—'

'ఆఁ యిందాక రైల్లో యివ్వటమే మళ్లీ పట్టలేదు.'

'ఆ బుట్టలో వున్నాయా పాలడబ్బా—నీసా అదీను...'

'ఆ... నేనిస్తాన్లే. నువ్వెందుకు లేవటం.'

'పాపం యేడుస్తున్నాడొదినా—'

'ఏడవనీ వెధవేడుపు...'

'వేడినీళ్లు కావాలి కాబోలు. కుంపటి అంటించనా.'

'నాకు చెప్పు. నేనే అన్నీ చూసుకుంటాను. నీకు తెలీదమ్మా నీకు కూడా వరసాగ్గా పిల్లలు కలిగితే...యిట్లాటివన్నీ...అప్పుడు అలవాటవుతాయి'

'ఛో...వదినా. సరదాకు పిల్లడికి పాలుపడతానంటే—'

'అదే'—మొదట్లో సరదా ఆ తరువాత ఖరీదు...యిందులోంచి తీసుకుందామన్నా తెరిచి వుండదు. చూడ్డంలే...'

చెల్లాయిలేచి బొగ్గులు కుంపటిచేర్చి నిప్పు రగిలిస్తూ

'చాలా చిక్కావే వదినా...'

సరస్వతి తనదగ్గర పాలు కలుపుతున్నది నెమ్మదిగా తలెత్తి 'ఏదో నువ్వైనా అడిగావు సమాత్రం— అందుకే సంతోషిస్తున్నా.'

చెల్లాయి 'అన్నయ్య వస్తున్నాడు...' అని గొంతు కుంచించి—

'ఈ యిల్లు నీకెట్లా తెలిసింది చెప్పు...యింతి మూల డాబా గార్డెను లోంచి చెంగల్రావు పేటకు వచ్చేశామే...'

'నోట్లో నాలికుంటే అన్నీ తెలుస్తాయి... నాకేం సిగ్గు మొహమాటం భిడియం లేవు. ఇదివర కేమన్నా వుంటే అ కొస్తా యిప్పుడు హరించుకు పోయాయి. ఎవర్నన్నా అడిగ్గలను-ఏవిధంగానన్నా యీ యిల్లుపట్టుకోగల్ను అనుకున్నాను. అంతే–'

'పోనీలే—ఎల్లా వుంది ?'

సరస్వతి నాలుగుమూలలా పరిశీలనగా చూసింది. అది మనపటివాటాకన్నా చిన్న— (అద్దె భరించలేక కాబోలు) గూభ్యంలా మూసుకుపోయి నేలబారున వుంది. గాలి వెల్తురూ తక్కువ. ఇహ లోపల, ఎక్కడ సామాను అక్కడే—నానా చిందరగానూ వుంది. గుమ్మం ఎదురుకుండా పెద్దవేప చెట్టు. నిత్యమూ బోలెడు రొట్టరాల్తుంది. దారివంట బస్సులు బళ్లూ మనుష్యుల కొలిదుమ్మూ అంతా యీ యింట్లోనే వుంటుంది.

సరస్వతిలేచి దొడ్లోకి వెళ్లింది అక్కడ ఎల్లా వుందో చూడామని. అటువైపు నొక పెద్దబాదం చెట్టు.

అప్పుడే మెరుపు మెరిసినట్లు తన అన్నగారి యింట్లోని సౌకర్యాలు అన్నీ హంసలూ, విరుగుడు చావ టేపాయి దగ్గర్నుంచి ఫిలిప్సు రేడియో సెట్టు వరకు జ్ఞాపకంవచ్చాయి.

మరైతే అక్కడే ఎందుకు వుండలేదు ? ఇక్కడికి యీ ఎత్తు పల్లాలు గతుకుల్లోకి దేనికి గాను తిరిగి వచ్చింది ?

సుఖాన్ని కాని దుఃఖాన్ని కాని కలిగించేది పొందేది మనస్సు. ప్రాపంచికమైన యీ యీ వస్తువుల్నుంచి వచ్చేవి అనుభూతులే—ఫిలిప్సు రేడియో సెట్టు, వాక్సుహాలు చిన్నకారు, నాలుగంతస్తుల మేడ—మనుష్యులు కోరదగ్గవే—కాని పూరికొంప. యింటినిండా గుస్తు గతుకులు పల్లాలు, ఒకటి వుంటే ఇంకొకటి లేని సంసారం— యింతులోనే గతుకు తుంటూ కూడా మనస్సు దివ్యమైన అనుభూతుల్ని [illegible]. మనుష్యుల్ని శాశ్వతంగా మనస్సుయొక్క అంతస్తుల్ని బట్టిగాని కొలిచేది, బ్యాంకు పాసుబుక్కు బ్యాలెన్సునుంచి కాదు. లోకం అనుకునేట్లు వుత్తమతరగతి జీవితం వున్నత భోగాల్ననుభవించటమే ఐతే—సరస్వతి నిష్కారణంగా నిలుచున్న పాళాన ఎందుకు విశాఖపట్నం ప్రయాణం కట్టింది ? ఏదివున్నా యేదిలేకపోయినా నాది అని చెప్పుకునే హక్కుకోసం ఆడమగా పోరాడ్డాన్ని బట్టిమాస్తే స్వేచ్ఛకోసం స్వాతంత్ర్యం కోసం అన్నిరంగాల్లోనూ పెనుగులాట సాగించటం మనుష్యులకి ఎంత సహజమో చప్పున తెలుస్తుంది.

సరస్వతి ఏమీ వులక్కుండా పలక్కుండా ఆ దొడ్డిగుమ్మాన్నానుకుని అట్లా ఎంతసేపో నిల్చుండి పోయింది.

పిల్లడికి పాలుపడుతూన్న చెల్లాయి అన్నయ్యతో మాట్లాడుతున్నది కాబోలు అని అనుకుని తృప్తిపడసాగింది. గుంటపక్క 'తా...త్త...త్త... త్తా...త్తా' అని చేతుల్ని తిరుస్తూ గచ్చుమీద సంపైపుకు పురుకుతున్నాడు పడాలికిగ.

అంతసేపూ సరస్వతి చూసిలేదుగాని బాదం చెట్టు క్రింద రాతిమీద కూర్చుని చిన్నమాసిన కొక్కాయి గుడ్డలో శాస్త్రి ఏదో ఆలోచిస్తున్నాడు.

ఆకాశంలో అంతకుముందు గుంపులు గుంపులుగా చేరిన నీలిరంగు మబ్బులమధ్య నుంచి క్రొవను చీల్చుకుంటూ చందమామ పైకిపైకి వస్తున్నాడు. ఆ వెన్నెల ఒక్కసారి వచ్చినట్లయింది బాదంచెట్టు కొమ్మలమధ్యనుంచి శాస్త్రికపుమీద కూడా వెన్నెల పడుతోంది. పగలల్లా ఎండలకు మాడివున్న నేల నెమ్మదిగా చల్లబడ్తోంది. బాదంచెట్టు క్రిందనుంచి

చూస్తే పల్చనిశరీరం—తెల్లటి నీలిరంగు అంచుల చీరలో గుమ్మంవద్ద నిలబడ్డ సరస్వతి చాలా మనోహరంగా అగపడొచ్చు.

హఠాత్తుగా ఆమె దృష్టి శాస్త్రిమీద పడ్డది. తక్షణం చెట్టునీడకు నెమ్మదిగా అడుగులేసుకుంటూ వినీవినిపించకుండా అంది—'ఇక్కడ కూర్చుని వొక్కరూ ఏంచేస్తున్నారు?'

'...........'

'అదంతా నామీద కోపమేనా...'

ఒకటి రెండు బాదమాకులు ఫుటుక్కున విరిగి నేలకుపడ్డ శబ్దం వినా అతిడివద్దనుండి సమాధానం లేదు.

వెనకనే నిల్చున్న సరస్వతి—కఠినంగా, నే వసలు అన్నింటికీ తెగించివచ్చాను. నాదగ్గర మంచితనం లేదు. అనవసపు వేమైనా వుంటే నా ముఖానే అనెయ్యండి. అంతేకాని...'

శాస్త్రి మోకాలు క్రిందకుదింపి 'హుఁ' అని మూలిగాడు.

'అన్నట్టు చెల్లాయి వుత్తరం వ్రాసింది. మీరు కోతిని వుంచుకుని దానికి నాపేరు పెట్టారని...'

శాస్త్రి చప్పున అక్కడ్నుంచి లేచి వెళ్లిపోబోయాడు. అతిని ఎడమ చేతిని చప్పున అందుకుని వెనక్కు లాగుతూ—

'ఆ వ్యవహారమంతా నలుగురినోట్లోనూ పడింది. వీరాకేమో మతి చలించిందని...నా కొక్క దానికే తెలుసు. ఈ తంతంతా ఎందుకు జరిపిస్తున్నారో.'

చేతినిగట్టిగావిదల్చి శాస్త్రి లోపలికి చూస్తున్నాడు. చప్పున సరస్వతి బిక్కమొహంపెట్టి రెండుచేతుల్తో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి యేడువ నారంభించింది. బాదంచెట్టుమీద కాకి ఒంటికాలుమీద కునుకుతూ హటాత్తుగా లేచి 'కా...కా' అని అరవటంతో, సరస్వతి యేడుపు మాని గూనుమీదకు ప్రాకబోతున్న గండుపిల్లిని చూసి రాయితీసుకుని వేసింది. అంతే...మళ్లీ యిది వరకు శాస్త్రి కూర్చున్నచోటే కూలబడి మోకాలు మీద అన్చిన తలతో అలోచిస్తూ యేడుస్తూ కాలక్షేపం చేయసాగింది.

చెల్లాయి కొంతసేపటికి వెతుక్కుంటూ వచ్చి—'ఏమిటిక్కడ...ఎందుకు ఏడుస్తున్నావు వదినా...' అంటూ బుజంమీద చేయివేసి కుదిపింది.

అంతక్రితమే మబ్బుల్లోకి వెళ్లిన చందమామ మళ్లీ యివతలకొచ్చి తొంగితొంగి చూస్తున్నాడు.

'నాకు చెప్పవు వదినా...నే నన్నయ్యను పిలుచుకొస్తానుండు' అని వెళ్ళి నులకమంచం కుక్కిలో వూగుతూ అర్ధనిమీలిత నేత్రాలతో గతించిన మర్కట సుందరిని తల్చుకుంటూ పడున్న శాస్త్రి నుద్దేశించి,

'అన్నయ్యా వదిన యేడుస్తోంది?' అంది చేతులు నలుపుకుంటూ.

'ఏ వదిన...' అంటూ అయోమయంగా ప్రశ్నించాడు.

ఈమారు చెల్లాయి కూడా సరస్వతిపక్షం తీసుకోక తప్పిందికాదు.

'వదినంటే—ఆ డాబా యింట్లో ఆనాటి మేడమీద ఎలక్ట్రిక్‌తీగను ముట్టుకుని చనిపోయిన కోతేనా నీ అభిప్రాయం.'

'అంతే... అసలైన వదిన ఎప్పుడో యిక్కడ్నుంచి వెళ్ళిపోయింది.'

'ఛీ అన్నయ్యా. నువ్వు ఒక్కమాటు వచ్చి పిలిస్తే వదిన తప్పకుండా వచ్చి అన్నం తింటుంది.'

శాస్త్రి మూర్ఖంగా 'నావల్ల కాదు...' అనేశాడు.

చెల్లాయి వెంటనే దొడ్లోకి పరుగెత్తి తెగించి ఆడిదల్చుకున్న అసత్యం వొదిన ఎదుటను పెట్టింది.

'అన్నయ్య పిలుస్తున్నాడు నిన్ను—'

సరస్వతి మడుకులమీద ఆన్చిన తల నెత్తి 'నన్నా...'

గుండెలు కొట్టుకుంటుంటే చెల్లాయి 'అవును. నిన్నే...' అని చీకట్లోకి ముఖం త్రిప్పుకుంది.

ఆ అమాయకురాలు యీ మాటలను నమ్మేసి చెంగుతో ముఖం తుడుచుకొని నెమ్మదిగా అనుసులో అడుగు వేసుకుంటూ పడకగది చేరింది.

దాన్ని పడకగది అని అనటంకంటే కలకత్తా చీకటికొట్టు అనటం యుక్తమనిపించుగొంటుంది.

గదినిండా డబ్బాలు—నానా చెత్తాను. మధ్యగా నులక కుక్కిలో శాస్త్రి మాగన్నుమీదున్నాడు. సరస్వతి ఒక అడుగు ముందుకువేసి గడ

సను దాటిందో లేదో అవతలివైపు కిటికీదగ్గర ఊపిరి బిగ్గబట్టుకుని నిలుచున్న చెల్లాయికి యీ క్రింది మాటలు వినిపించాయి.

సరస్వతి—'పిలిచారట...'

నిశ్శబ్దం.

'మిమ్మల్నే...ఎందుకని అడుగుతున్నాను.'

'నువ్వు నిలువు నిలువంతా అబద్ధాలకోరువి. నీఅంతట నువ్వు వచ్చి నేను పిలిపించానని డబాయిస్తున్నావు.'

'పిలవలేదూ...చెల్లాయి వచ్చి చెప్పింది మీరు పిలిచారని.'

'ఇది వుంకో అబద్ధం—'

'సరే—నేనన్నీ అబద్ధాలే ఆడుతాను. మీరింకా ఎందుకు నన్నిట్లా యేడిపిస్తారు?' శాస్త్రి మాటలు వినిపించలేదు. సరస్వతి గొంతుకే తెచ్చుకున్న వుద్రేకంతో—'కానివ్వండి. మగ మహారాజులు. మీ యిష్టమొచ్చినన్ని ఆటలు మీరు ఆడవచ్చు. ఎల్లా యేడిపించదల్చుకుంటే అల్లా యేడిపించండి.' మళ్ళీ గొంతుకలో వొణుకు...దుఃఖంతో మిళితమైన మాటలు వెంటవెంటనే దొర్లాయి— 'నేను మొండిపీనుగను. మీరు వెళ్ళమన్నా వెళ్ళను. ఇదే నా యిల్లు......యిక్కణ్ణుంచి నన్ను ఎక్కడికీ ఎవరూ వెళ్ళగొట్టలేరు. మీరు నాతో మాట్లాడక పోయినా నేను యిందులోనే వుంటాను. ఆఖరికి మీ చేతుల్లో ఏ రోజో మీరే యీ నా కాస్త గొంతూ...'

శాస్త్రి వున్నమాటున ఫెళ్ళుమని చెంప పెట్టులా తగిలిన మాటలకు వులిక్కిపడి లేస్తూ—గోడను వ్రేలాడుతున్న దీపంబుడ్డి వత్తి పెద్దది చేసి చేత్తో పట్టుకుని సరస్వతి ముఖాన ధారలుగట్టి స్రవిస్తూన్న కన్నీటి దొంతరలను వింతగా చూస్తూ—'నీ హృదయం రాయి రా పాషాణమనుకున్నాను. కాని యింత జేల వనుకోలేదు.' అని పకపకా నవ్వాడు. ఒక్కమాటు దించిన తలను కాస్త యెత్తి కోపంగానే అంది— 'నేను అలోలక్ష్మణామని యేడుస్తుంటే మీకు హాయిగా కడుపునిండుగా వున్నట్లుందే—'

'అవును.'

'అల్లాగే వుంటుంది లెండి. గుమ్మంలోకి అడుగు పెట్టే చేసుకున్న దాన్ని కదా ఏమని నోటి నుంచి మాట పెగిలిందా మీకు? ముత్యాలు రాలి పోతా యనుకున్నారు.'

'అంతే—ముత్యాలు రాలి పోతా యనుకున్నాను.'

'పోనీ—కన్న పిల్లవాడివన్నా దగ్గరకు తీశారూ?'

'వాడూ నీ పిల్లాడేగా...'

'అదీ...కోతుల్లో ప్రేమలు వెలిగించే సుఖాలకు అంతకన్నా ఏవిటి తెలుస్తుంది.'

'కోతులే నయమంటాను నేను మనుష్యులకన్నా. ఒక పొరపాటు చేశాడు భగవంతుడు. అందరికీ తోకలు లేకుండా మనుష్యుల్ని చేసేశాడు కాని, కొంత కొంతమందికి—ఆ స్వభావం కల వాళ్ళను, తేలిగ్గాపోల్చుకునేందుకు వీలయేటట్లు తోకలువుంచితేనే బాగుండిపోయేది?'

'ఏయే స్వభావం కలవాళ్ళకు?'

'అదే—నీకు మల్లే, చీటికీమాటికీ తగాలాడి తెగించి పుట్టిళ్ళకు నా కేమని పోతూంటారే...'

'మాటలు తిన్నగా రానియ్యండి.'

'ఏం—యీమాటు చీపురుకట్ట తిరగేస్తావా?'

'ఆ ముక్క ముందుగా మీ నోటినుంచే వచ్చింది. నేనన్నాను. మీరు వెళ్ళమంటేనే వెళ్ళాను.'

'మళ్ళీ ఎందుకొచ్చావు? ఏ ముఖం పెట్టుకుని.'

'మీకు ఆ వెళ్ళమనే అధికారం లేదని తెలుసుకున్నాక వచ్చేశాను.'

తరువాత శాస్త్రి నవ్వు వినపడింది. మళ్ళీ మాటలు—'నువ్వు యీమారు రెండాకు లెక్కువ చదువుకొచ్చినట్లున్నావు. యిసోక్కమంటే యిసోక్కమంటున్నావు.'

'మీరు మాత్రం—కోతుల్లో కాపురం సలిగించి రాలేదూ—' శాస్త్రికి మిసెస్సు జ్ఞాపకానికొచ్చింది. నెమ్మదిగా అనదల్చుకున్న మాట పైకనేశాడు—'చెల్లాయిని రేపువారం యిక్కణ్ణుంచి తోలేస్తాను.'

సరస్వతి 'మీ కాళ్ళు పట్టుకుంటాను—ఆ ముక్క మళ్ళీ అనకండి.' శాస్త్రి నవ్వి 'నీ ధోరణి చూస్తుంటే అంతా కోతిచేష్టలు మల్లే అనిపిస్తోంది. వెళ్ళేముందు తెచ్చినందుకు తగాలాడావు. ఇప్పుడు పంపిస్తానంటూంటే యిట్నుంచి మళ్ళీ వద్దంటున్నావు. ఏమిటిది?' సరస్వతి గోడను జారగిలబడి 'మీరు ఒక్కమాటు గాదు, వెయ్యిమాట్లు గాదు, లక్షసార్లు అనండి. నేను కోతినే...కోతినే......కోతినే...' అని ఫక్కుమని నవ్వేసింది.

# సుద్యుమ్నరాజ చరిత్రము



శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

మనోజ్ఞము లయ్యును అజ్ఞాతముగానుండి రచ్చకెక్కని కొన్ని యాధునిక ప్రబంధములలో "సుద్యుమ్నరాజ చరిత్ర" మొక్కటి. ఇరువదవ శతాబ్దారంభమున వెలువడ్డ రసవత్తరములగు ప్రౌఢ ప్రబంధములలో నిది ప్రథమ శ్రేణికి జెందును. ముప్పది సంవత్సరముల నాడే చెన్నపురియందలి వావిళ్ళవారి "ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాల"లో ముద్రింపబడి యీనాడొక్క ప్రతియైనను లభించుట కష్టమైన యీ సుందర కావ్యము నొక మిత్రునివద్ద చూచి యాశ్చర్యపడితిని. ఇరువదవ శతాబ్దారంభమున— పెద్దన, రామరాజ భూషణుడు, రుద్రకవి, ముక్కుతిమ్మన, కూచిమంచి తిమ్మయ మొదలగు మహాకవుల కావ్యముల ధోరణిలో అనవద్యముగను, అనర్గళముగను ఈ కావ్యము సాగిపోవుట పండితులకును, పామరులకును విస్మయావహము. ఈ సుద్యుమ్నరాజ చరిత్ర మైదాశ్వాసముల ప్రబంధము. అష్టాదశ వర్ణనములతో గూడిన మహాకావ్యముగా కవి దీనిని నిర్వహించినాడు.

## కథా సంగ్రహము

మనుపుత్రుడగు సుద్యుమ్నుడు వేటకై పోయి కుమారవనములోని యొక కొలనులో మునుగగా కామినిగా మారిపోయి "యిల" యను పేర బరగును. అతని పరివారముగూడ సరస్సున జలక్రీడల దేలిన కారణమున, నాడువారై యిలాదేవిని సేవించుచు వనములో విహరించుచుండ చంద్రసూనుడగు బుధుడు తపముసేయుచు వారికి గాన్పించును. బుధుని గాంచి యిలాదేవి మోహించి తపసి గావున శాపభీతిచే మిన్నక చింతనున్న మేరుపర్వతమున కేగి వేదనపడుచుండును. తిరువాతి శిష్యునివలన నిలా వృత్తాంతము నెఱింగిన బుధుడు ఆమె కంయికకై పరితపించును. కడకు ఇల కొచ్చేలివల్లను, బుధుని శిష్యునివల్లను నాయికానాయకులకు సమాగమము కలిగి చంద్రవంశ వర్ధనుడగు పురూరవు డుదయించును. ఇది యిందలి కథ. పురూరవుని పుట్టుక యిందు వర్ణింపబడినది గావున "పురూరవోదయ"మనియు దీనికి నామాంతరము. ఇతరములైన యితర ప్రబంధముల వలె ఈ కావ్యమునందును కథాభాగము విరివిగా లేకున్నను, ఒక పురుషుడు స్త్రీగా మారి అనురూప వరలాభము నంది సంతానమును గనుట యనునది యిందు విశేషము.

ఈ కథాంశము వేదవ్యాసవిరచితమగు శ్రీ భాగవతమునందును, వాల్మీకిరామాయణమునందును సంగ్రహముగా నున్నది. రామాయణస్థ కథను కంకంటి పాపరాజు తన యుత్తర రామాయణమున నించుక పెంచి వ్రాసెను. భాగవతేతివృత్తమును మనోజ్ఞమగు శృంగార ప్రబంధముగా కొజ్జిపాటి (కడప జిల్లా) సంస్థాననివాసుండగు కొజ్జిపాటి గురవయ్య కవి రచించెను.

## కవిచరిత్రము

ఈ కొజ్జిపాటి గురవయ్య విశ్వబ్రాహ్మణ కులోద్భవుడు. సానగర్షి సగోత్రుడు. మునిమాంబకు పిన్నగురువప్పకు బుత్రుడు. శేషాచార్యులకు ముఖ్య శిష్యుడు. కాళికాంబా వరప్రసాదాంచితుడు, పురహారాంఘ్రియుగళ పూజాభిరతుడు. సహజ దరిద్రుడగు నీ కవిని గొంద ఱాప్తమిత్రు లాతనియందలి కవిత్వ పాండిత్య శక్తు లడిగిపోవుటకు సైపక, ప్రేరేపించి ప్రోత్సహింపగా దా నీ ప్రబంధమును వ్రాసితినని గ్రంథావతారికలో జెప్పుకొనుచున్నాడు—

"అనుపమ విద్యానిలయం
బనెడు సభకు నాదు మిత్రు లంచితగతితో
నను రావించి దయామతి
గని యిట్టుల బల్కి రధిక గౌరవ మొప్పన్."

"ప్రతి పద్య రసాస్పదముగ
గృతి రచియింపంగవలయు గీర్తి చెలంగన్;
క్షితి నే ప్తసంతతుల ద
త్కృతియే శాశ్వతము మిగుల సేవలమనుచున్."

"కావున నీవొక సత్కృతి
గావింపుము శక్తికొలదిగా గవిజనసం
భావిత కవితాచాతురి
భావించుచు కీర్తిశెల్ల బొంకితి మెచ్చన్."

"శ్రీ కొల్లిపాటి పురీవర సంస్థాన
సంవాసుడవు బ్రహ్మ సంతతియును
పావన ఋషిగోత్ర సంజాతుడవు ముస
లాచార్య పౌత్రుడవార్య వినుతుం
డను పిన్న గురవప్ప కాత్మజుడవు కాళి
కాంబా వరప్రసాదాంచితుడవు
గురువయాఖ్యుడవు సద్గురువు శేషాచార్య
ముఖ్య శిష్యుడవు సమ్మోదమతివి
సభ్యుడవు గ్రంథసృష్టి కుశలుడ వరయ
బుధజన విధేయుడవు భక్తి బురహరాంఘ్రి
యుగళ పూజాభిరతుడవు సుచితగతివి
మాకు 'నాచారి' వత్యంత మహిత గుణివి."

అని బహూకరింపగా పురాతన కథావిస్తరంబుల నెమకితా నీ కావ్యమును శ్రీ చెన్నకేశవాంకితముగా వ్రాసినాడట. ఈ చెన్నకేశవు డే గ్రామమున వెంచేసియున్న స్వామియో గ్రంథకర్త యెచ్చటను సూచింపలేదు. కొల్లిపాటిలో నే చెన్నకేశవాలయ మున్నదేమో మఱి. ఎట్లైనను చెన్నకేశవానుగ్రహము తనకు బూర్తిగానున్నట్లు గ్రంథాంత గద్యములో గూడ గవి చెప్పుకొనినాడు—

"ఇది శ్రీ మచ్చెన్నకేశవస్వామికృపాలబ్ధ సరస కవితా చాతురీధురీణ త్రిభువన నిర్మాణోద్ధారక మను వంశపయోదధి రాకా సుధాకర పావనర్షి సగోత్ర శ్రీ కాళికాంబా పాద పద్మారాధనాసక్త చేతోవిరాజమాన ముసలాచార్య పౌత్ర పిన్న గురుమూర్త్యాచార్యపుత్ర సదమలగుణ భాసమాన మునిమాంబా గర్భ శుక్తి మౌక్తికాయమాన బుధజన విధేయ గురువయ నామధేయకవి ప్రణీతంబైన పురూరవోదయంబను నామాంతరంబుగల సుద్యుమ్న రాజచరిత్రము..."

పై గద్యమునుబట్టియు గవిచరిత్రము సువ్యక్తమగుచున్నది. తన వంశకర్తనుగూర్చి "త్రిభువన నిర్మాణోద్ధారక" అని చెప్పుకొనుట తన వంశపు శిల్పప్రతిభకు నిదర్శకము.

## కథా సంవిధానము.

పుణ్యముల కునికిపట్టైన ప్రతిష్ఠానగరమును సుద్యుమ్న మహారాజు పాలించుచుండ, నొకప్పుడు మధుమాస వాసరములు భాసురములై చెలంగెను. ఆ సమయమున నిండు కొలువున్న యేలికకు కుమారవనమున కావలనున్న మలల నాలుం నెలవుగా జేసికొని కాపురము నడపు చెంచుల గుంపు వచ్చి, అడవి మెకముల బెడద బసబాలకుంటేమని, తమ సేగిని రాజునకు విన్నవించి వందదీర్ప వేడుకొనెను. చెంచుదొరల పలుకులు వేట తమకమును రెట్టింప నేడారేయి గడపి, మఱునాడు వేటకై కట్టాయిత మయ్యెను. వేటకరుగబోవు పుడమియేలిక యెట్టి గుఱ్ఱము నెక్కుచున్నాడో చూడుడు—

పొన్నుతంతియల మువ్వగివా గకలియమ్మ
మందంపుమడికొను బొందళమ్ము
అపరంజిపోగుముత్తెపు కుట్టుపనిజీను
తళుకురావిగ్గుల తంగువారు
ఢాళట్టువనరాజిడాలు వాబరిచియు
పొన్నీరుబచ్చిన పాదుపువిల్లు
ప్రక్కలకోలల చిత్తరికలదంప
రహిమీఱరాణించు రవలపిడెము
బచ్చుమానికముల ముఖపట్టకెంపు
రాలుదాపిన కలికి తురాయమర్చి
తనర బడివాగె సవరించి ధనికి నెదుట
జవమునోర్లాతిపితి వేసాదిదెచ్చె.

అచ్చతెనుంగుపదములతోడి యీపద్యము అశ్వవేగమునలె మన కందుకొనగాకయున్నది.

ఇట్లు జూహురాణము నెక్కి పయనమైపోయిన రాజు విచ్చలవిడిగా నక్కానగల మృగఖగముల గడపి, చెంచుల వాంత దీర్చినాడు. వేట ముగిసిన పిమ్మట ఆ వేటకులు చెంచులును నానావిధ మాంసములను గమ్మగా వండుకొని మెసవి, రాజుతో గూడ హాయిగా విశ్రమించినారు. సుద్యుమ్నుడు కుసుమ శయ్యాతలమున బరుండి కెంజాయేటి తామరల సువా

వనల గలసివచ్చు పిల్లతెమ్మెరల శ్రమ తీరుచుండెను. అయ్యడవిలోని ప్రాణుల మాంసములచేత క్షుత్తు మాన్పుకొనుచు సమీప పర్వతప్రాంతమున నున్న జీవాంతకుడను నిశాటుడు, పక్వమాంసముల పరిమళములచే ప్రేరితుడై తన సేవకులవలన "సుద్యుమ్నుడు వేట కరుదెంచి వనములోని మృగఖగముల మట్టుపెట్టి నాడ" ని విని యమాత్యసహాయము రూపుమాప దానవులతోగూడ కదలెను. మానవదానవపతులకు పోరు ఘోరముగా జరిగెను. అటు రక్కసులు, ఇటు చెంచులు, రాజసైన్యములు పెక్కండ్రు కూలిరి. ఇంత భయంకరరణము జరుగుచున్నను దానవుడెంత సేపటికిని చావకుండుటను గాంచి, రాజు పావనలబ్ధి తన యొక్క శివపాయకము నేసి తూణిని చేబట్టి గ్రహించి అగ్నిబోలు బాణము నొక్కటి విడువ—

అక్కటవపు దివ్యాస్త్రం
బక్కఁగలింపంగ నుండియులనుదిత్రేలన్
పక్కుల్లు గడిసి దానవు
డుక్కుదొరగి ప్రుక్కి ప్రుక్కి యుర్వీవ్ బడి—
యొక్కట దివ్యపూరుషుడైనాడు.

కోటి పవెల్గులఁగూడిన చోటునా
రత్నకిరీటంబు రాజిలంగ,
బదియాఱుకళలుండు పట్టునా నొప్పారు
మురిపపుముద్దు మెమ్మోము వెలుఁగ,
బండువెన్నెలపట్టుపవలు కాసెనో నాఁగ
జిన్నారిలేవన్వ వన్నెగుల్క,
రిక్కలచాలొక్క చిక్కునిల్చెనో నాఁగ
నురముపై ముత్తెపుసరులు మెఱయ,
నలదు జవ్వాదిగమగమ లాడ, జిలుఁగు
రవణములు మ్రోయ బలిచామరములు వీవ,
గంధమబ్బులలో నీడ గానిపించు
ఖచరవరు గాంచి దొర వెఱగంది..."

యాలిని యాత్మచరిత్ర దెలుపఁగోరెను.

"ఈతడు చిత్రుడను గంధర్వరాజకొడుకు చతురుడు. ఇతనికి విశారదుడను చెలికాడు గలడు. వీరిరువురు నొకసారి దేవేంద్రుని సభలో నారదుడు నాతని శిష్యులును గానించు గానము నాలించుచు గురుశిష్యులలో నెవ్వరధికులని వాదమునకు దిగిరి. అభిప్రాయములు కలియక గురువెక్కుడని యొకడును, శిష్యుడెక్కుడని యొకడును వాదులాడి చివరకు "సిగపట్ల గోత్రము" వారైరి. అది ముష్టియుద్ధములోనికి మారినది. "పిల్లజెద్దుల"కు రేగి పోరుచున్న వీరి సందడికి సభ చెల్లాచెదరగుటకు గానభంగమయినది. ఇంద్రుడు నడికట్టి వీరినిబట్ట భటులకు ముదలయిడెను. ఇది యెఱిగి విశారదుడు డీడ వాడ బఱచు పాఱిపోయినాడు. పిమ్మట నింద్రుని యాజ్ఞచే నారదుడు చతురుని నిశాచరుడవు గమ్మని శాపమిచ్చి, యుద్ధములో మడిసినతఱి రాకాసితనము పోయి ఖచరభావము వచ్చునని యాదేశించెను."

చిత్రుడిట్లు తన వృత్తాంతము నెఱింగించి రాజునకు కృతజ్ఞతనూపి, తన గీమున కేగెను. ఈ కథాక్రమముతో గండాశ్వాసములు ముగిసినవి.

లోగడ నీ దానవుడు పెట్టుచున్న బాధలకు దల్లడిల్లుచున్న మునులు మనుసుతునిచే రక్కసి పొలియుటను గాంచి, తమ కష్టము తీఱెనని రాజును దీవించి యగ్గించిరి. వేటచేతను, రక్కసులతోడి కదనముచేతను డస్సి, విశ్రాంతినిగోరిన భూపునికి ఒక చెంచు కనకాద్రికి చేరువనున్న కుమారవనమును జూపించి, యచ్చటి భోగ్యత్వమునుగూడ వర్ణించి, యందు హాయిగా విహరింపవచ్చునని చెప్పినాడు. అతనికి కుమారవనమును జూడ వేడుక చెంగలించినది.

"క్ష్మారుహ శీతలచ్ఛాయా సుఖాసీన
గంధర్వ కామినీ గానయుతము
నవ్యపల్లవ ఖాద నప్రహర్షోన్మద
పికపంచమస్వర ప్రకటనంబు
సరసఫలాహార సంతతామోద వి
స్తార శుకాలాప సంకలితము
నూనమరంద పానానంద సంభ్రమ
ద్రోలంబ ఝంకార రుతమహితము
నటనకృద్బర్హి షడ్జము నాదఘనము
రాజహంసాది జలపక్షి రాజకముల
కైరవాంచితసార సాకర కలితము..."

నను కుమారవనంబును గాంచిన భూకాంతు డందలి నానావిధ వృక్షముల సింగారము మనమ్మున కానందము గలిగింప నద్భుతవిశేషంబులు చూచుచు నొక్కచోట

"అలివేణిక, వికచోత్పలాక్షి, కమ
లాస్యక, హంసవాణిక, దరో
జ్జ్వలకంఠిక, బిసబాహ, జక్రకుచ, నా
కర్ణోదునాశిక, ముకై

తనరెడుదాన నాట చక
  తంబును జారుచు, మీయనోప, నీ
మనిరెడుదాక నీకు నొక
  మాసము స్త్రీత్వము నొక్క మాసమం
దనుపము పూరుషాకృతిని
  పొందగ జేసితి పొమ్ము..." అన్నది.

ఆమె కరుణచే సుద్యుమ్నున కొక నెల యాడు రూపును, ఒక నెల మగరూపును ఏర్పడినది. కొంతకు కొంత మేలు. సగము మగతనముగల పార్వతి యింత కన్న నేమి చేయగలదు? ఇక దక్కిన పరివారమును దమకు కామినీత్వము తప్పదనుకొని యందఱును పెళ్లి పెట్టుకొని, రాజున కిలయని నామకరణము చేసిరి. అందొక్క శుకవాణి యొబ్బసుపోకకు వని లోని వింతల నారయ బ్రేరేచెను. ఇలాదేవి చెచ్చెలి పింకగూడి వనవిహారము సేయుచు బంగారుకొండ దరినున్న యొకవనిలో నిక్కని పద్మాకరము కొనరాగా జలకేళికి బూనుకొనెను. అందు సలిలాస జలక్రీడల జేలివచ్చుచున్న సమయమున, ఆ కమలాకర మధ్యమునందలి నీట "కిసలయాయుధునితోడుల తూగు సోయగము గలిగి, మొలకమీసము లొప్పారు మోమునందలి చెక్కుటద్దముల తళతళలతో రుచిరమ్యమై తపము సేయుచున్న సౌమ్యుని గాంచినది యిల. సంభ్రమమును మీఱ నాతని రూపరేఖా విలాసములకు ముగ్ధురాలై మరులుకొన్నది. ఇంక నేమి? మరుని కిదియేకదా సందు! కుచదుర్గములు పగులగొట్టి, వక్షఃకవాటమును జొచ్చి, హృత్పీఠముపై నాసీనుడై ప్రభుత్వము సేయ దివిరినాడు కాముడు.

ఇలాదేవి బుధుని గాంచి మదనపీడితయైనదని యెఱింగిన చెలి శుకవాణి సమాధిస్థితి నున్న సౌమ్యుని యిలా హృదయము నెఱింగింప కిసిసి శపించునని, ఎచ్చటికైనను బోదమని యుత్తరదిక్కుగా ద్రోవదీసినది. ఎదురైన సిద్ధసాధ్య స్త్రీలను గనకాద్రికి త్రోవ యడిగికొనుచు, మార్గములోని ప్రకృతి దృశ్యముల నారయుచు, గంధర్వికల గానపాండితుల కచ్చెరువడుచు బోయి పోయి—

అటజని కాంచి రబ్జముఖు
  లగ్రచరత్సుర కామినీపదో
త్కటకనులాంక లక్షణని
  ధానమహోన్నత శృంగజాలమున్,
రటదురుభేచి నిర్ఝరవి
  రావవిఘూర్ణిత దిగ్విలాసమున్,
స్ఫుటఘనగైరిక ద్యుతి వి
  భూషితసాలము స్వర్ణశైలమున్.

ఈ పద్యము పెద్దనగారి "అటజని కాంచె భూమిసురు"డను పద్యమున కనుంగుబిడ్డ. కవియిందు గెలుపొందినాడు.

శుకవాణి బంగరుకొండకు దీసికొనిపోయి యామె మనసు త్రిప్పజూచినదికాని, యిలకు గాకలసిన బంగారుకొండ మట్టిగడ్డ గదా! ఆ కొండచే జూరిన నే యాయందెజయానకు మనశ్శాంతి. కనుక నే పాపమామె—మనుపటివలె మాటాడదు. అప్పుడప్పుడు దనుదోయి చెమర్చుచుండును. మేన బులకలు పుట్టుచుండును. మైమఱచుచుండును. ఇట్లామెకు కామభూతపు కళలావేశించినవి. ఆమె మోహముగ్గల మునుకు గాలికి గూలు నరటిబోదెవలె సమ్మూర్ఛితయైనది. చెలులందఱామెను ముసరుకొని యేడ్చి, శైత్యోపచారములు చేసిరి. ప్రౌఢయగు శుకవాణి యిది మనసిజుని చేత యని గ్రహించి మన్మథరోగమునకు మందులన్నియు వాడినది కొండలపడక నీవు వలచిన సుందరుని వచింపుమని చెలులు గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా—

పరగమామకదహారన భిక్షలమున
కలితదరహాసచంద్రికాకందళంబు
లొలయ మునిచంద్రు డెవ్వడో యువిదలార
యొక్కరుండుండి నన్నిట్లు స్రుక్క జేసె.

అని తన మనోగతము నెఱింగించినది. ఆ పల్కు లాలించిన శుకవాణి "కొలకొలని కోవెలలు గూయుతావున, పలపలని చిల్కలు పల్కుచోట, తుమ్మెదలు జుమ్మని మ్రోగు నెలవున, నెమ్మి గుంపులు కేకలు వేయు చక్కి" కీ యువతినుంచరాదని యొక కోనలోని దివ్యమణి భాస్వన్మంటపమునమ్మ వీణాగాన వైఖరులతో దజ్రోయుచుండెను.

ఇచ్చట వారివిహారములు చేసిపోయిన కామినుల శరీర సుగంధవాసనలు నాసాపుటముల బ్రవేశింప, మునిద్రగ్గాంతుడై లేచి, "ఈ కొలకున నెవ్వతో యెమ్మెలాడి జలవిహారంబు గావించి చనె" నని నీటగలిసిన కుంకుమరాగులను బట్టి యూహించి, యోగదృష్టితో జూచెను. ఇక నేమి? మన్మథుని నిశాతబాణమువలె నిలయాలిని మనోనేత్రమునకు దోచినది. ఆమె చక్కదనము, లేబ్రాయము నీతని మన్మథపరతంత్రుని నొనర్చెను. ఇలమీద విరాళిచేత బాపపడుచున్న సమయమున, పత్రకుశ పుష్పఫలాదుల కేగిన శిష్యుడు శారద్వతుడు వచ్చి కనకనగ ప్రాంతమున నున్న కోనలలో దాను గన్న సుందరిని. ఆమె వీణాగానచాతుర్యమును వర్ణించి వర్ణించి బుధునికినోరూరించి,

'ఇలయను నామముగలదా
జలజానన వారికెళ్ళి పలిపెడు వేళ౯
తలచినదట నిను,'

అని యూరిని యభిలాషముసకు పాదు చేసినాడు. ఇలహృదయము వెలిగించిన బుధునికి మరీ తలపు రెట్టించినది. అయిన సమాగమ మెట్లు సాధ్యము? ప్రొద్దుపోక బుధు డామె సౌందర్యమునుదన కవితాచాతురి మీరా వర్ణించుకొని కోకి వెవబాసిన కోకమురీతి గుందుచుండెను.

అక్కడ విలయవస్థను జూపలేక కీరవాణి యామెను శెలుల కప్పగించి, మునివృత్తాంతము నరయబోయెను. పాప మా చెలియ పోయిపోయి తుదకు బుధాశ్రమమును జేరి "అందున నొక సరసీతట మందు శిశిరగాత వేదికాయయుతి సుమశయ్యం దన తను పుర్ జేరిచి యింగునికరరకుంతిహతుల కెపపసు దూవి"ని గాంచి తొంటిపగాని యితడేయని భావించి వాని మనము నెలుగగోరి మాటున నిలబడియుండెను. చంద్రనూనునికి మన్మథావస్థలు మితిమీఱగా నుస్సురని యూర్చుచు నిలనుగూర్చి పలురీతుల బలవించుచుండెను. ఈ సందు గనిపట్టి కీరవాణి చాటున నుండియే "ఓ నిశాపపుత్ర! యే యంగజయాసర్గోనను దనంతట దానె తరించునే పతి౯? దండిగ దూతె జేల చెలి తప్పదియేమి కొలంకునీట నుద్దండ తివా యిపుడ్ తలచు తిన్వనిజాపని తప్పటుంపెగ౯!" అని నొవ్వనాడినది. ఆ పలుకులువిని యిలా దేవి తెఱకై యెంత కుందుచున్నదో యని నొచ్చుకొనుచు శోషపడుచున్న బుధుని గాంచి, కరుణించి శుకవాణి యిల పంపిన ముత్యాలహారము వాతిని కంఠమున వేసినది. ప్రేయసీప్రేషితమగు నా రత్నహారము తాపము మాన్ప, ముని తేరుకొని, కన్నులు విప్పి "హారమురా గతిమెద్ది? దీని నే దయావతి దెచ్చె? ఇది మేను సోక దీఅని తాపము తీఱెగదా యని—

"ఏ నొకసారి రొచ్చుటనో
యీ మణిహారము గాంచినట్లు నా
మానసమందు దోచెడిని;
మాముకరెయాగ విలోకనస్థయౌ
మానిని హార మీ విమల—
మా క్తికహారము మూపినొందెడుగ౯;
గాన నిలావక్షూటి మణి
కల్పితహారము గాక యున్యమే!"

అనుకొనుచు హారము న నేకరీతుల గౌరవించుచు దానితో సల్లాపములు జరపి, తిపహేమాంగి నెమములు సందేశములు నడిగెను. బుధునికి సగము తిరుణీ సమాగమము జరిగినట్లైయైన దీ హారమురాక,

సంగతి ఇంతవరకు వచ్చినపిమ్మట కీరవాణి దాగనేల? బుధునికి దన్నుగపఱచుకొని, సఖీవృత్తాంతము నుడివి, "గోలను బచ్చవిల్తు విరికోలల పాలు సేయుట న్యాయముకాదనియు, ఇది మీవంటి బుధులకు పాడిగాదనియు" చమత్కరించినది. బుధుడును అరలేని మనసుతో శిష్యుడగు కాంద్వతుని చే నింగోదంతము కొంత వినుట జేసిగొప్రాణములు ధరించితినని చెప్పి, సఖిజనులతో గూడ నిలను దన యాశ్రమంబునకు దీసికొని రమ్మని ప్రతి కౌతుకాలను గుఱుతుగా నిచ్చి శుకవాణి నంపెను.

తరువాతి నెలలు పేరంటమువ నిలా బుధుల వివాహమంగళము వైభవముగా జరిగెను. చివరకు

"క్రొన్నెలరాల తెన్నెపయి
క్రొత్తమెఱుంగుల మేలుకట్టువన్
క్రొన్ననపాన్పు సంగుతలి
కూర్చునిపీవన యాయ్యు పీవగా
బన్నగశాయి తుల్యని శ్రీ
పాకరసూనుని నయ్యిలాపతిన్
దిన్నగగూర్చి నెచ్చెలులు
దీవనుగా బనివాకున" బోయిరి.

సకిమవసోగహా చక్రవాకములకు
బతిరచవసొంపు పాయకుండ
మహానీలులతి కొంగి మధునోష్ఠఫలముప
కతికి మదిద్వజహాసులంటకుండ
గగనమువ్యక చాంచకొరంబుగకు విభా
కరయుక్తినిబిడత కదలకుండ
విదితయావనయారాగ కదళుల కౌత్తోక్కరు
కరికరంబుల బాధ గలుగకుండ
కరపుటంబులలాలించి, కౌంతి నించి,
చక్క సవరించి, స్నిగ్ధతి సంఘటించి,
యిలను నూతనసంభోగకల దన్పె
నఖిలవాలోకజితవిధుడైన బుధుడు.

అహో! ఎంత లలితమైన సంభోగము. ఈ లాలిత్యములోని యుచితానుచితములు పాఠకులే నిర్ణయించుకొనవలెను. సంభోగవర్ణనములో ని యీ పద్యమున శ్లేష, రూపకము, యథాసంఖ్యము నను మూడలంకారములు గూడుకొని కవిలోకోత్తర ప్రతిభను జాటుచున్నవి. ఇట్లు కనకశైల శిరోభాగముల నయ్యిలాబుధు లనురాగరసములు చల్లిరి విహరించుచు లోనర్పు పురూరవుడను పుత్రరత్నము దయించి "పురూరవోదయము" రసవత్తర ప్రబంధముగా రూపొందినది.

### కథాకల్పనము

మూలమున భాగవత రామాయణములందున్న కథలకు గొంచెము భేదము కలదు. భాగవతము సుద్యుమ్నుడు మనుపుత్రుడని చెప్పినది. రామాయణమున సుద్యుమ్నుడను పేరె లేదు. పైపెచ్చు కర్దమప్రజాపతి కొడుకు ఇలుడని చెప్పబడెను. చిన్ని కథను కావ్య వ్యాప్తముగా పెంచి వ్రాయుటలో రసానుగుణముగా నలతిభేదములు సంఘటించుట కవి కనివార్యమైనందున, బట్టివానిని విడిచిన నిందు గంధర్వ శాపనివృత్తి వృత్తాంతము కవికల్పితముగా దోచుచున్నది. కాని ప్రధానకథకిది యేరీతిగను నుపకరించినట్లులేదు. మఱి వేటకేగనలసిన రాజునకు యుద్ధ శ్రమనుగూడ గూర్చి విశ్రాంతికోసము కుమారవనమునకు బంపుటకు మాత్రమిది పనికి వచ్చుచున్నది. రామాయణములో శివుడు శివను సంతోషింపజేసి విహరించుటకు దానును స్త్రీరూపమును దాల్చి కుమారవనములోనికి వచ్చిన ప్రాణులన్నియు స్త్రీ భావమును బొందునట్లు సంకల్పించును. భాగవతములో, దిగంబరయైన శివ శివుని యుత్సంగముపై నున్నతఱి, మునులాయనను దర్శింపవచ్చి శివాశివులు కేళిలో లున్రై యున్నారని వెడలిపోవ, శివు డా వనమున ప్రవేశించిన పుంల్లింగ నపుంసకులు స్త్రీ లౌనట్లు శపించెనని కలదు. మన కావ్యకర్త రక్కసులు వస్త్రము లపహరించినందున శివుడు శపించెనని కల్పించెను. ఇంకను కావ్యనిర్వహణమునకును, రస పోషణమునకును వలసరములగు కొద్దిమార్పు లావశ్యకములే కావున వానిని వివరింపను.

### వర్ణనాదికము

ఇటీవలి కాలమున వెలువడిన పెక్కు కావ్యములు చిత్ర కథా మహనీయములు కాక, వర్ణనధూయిష్ఠము లనుటలో నెవ్వరును విప్రతి పన్నులు కారు. ఆ రీతిగ నీ సుద్యుమ్నచరిత్రముగూడ వర్ణనములలో జాల ముందంజ వేసినది. ఇందునగరము, చతుర్వర్ణములు, పుష్పలావికలు, వసంతము, వేట, యుద్ధము, వనము, వనవిహారము, జలక్రీడ, నాయికానాయకులు, సూర్యచంద్రుల ఉదయాస్తమయములు, ఆశ్రమము, నాయికా నాయకుల విరహము, చంద్ర మన్మథాద్యు పాలంభనములు— అను విషయములు సాలంకృతముగా వర్ణింపబడినవి. శబ్దార్థములపై పూర్ణ ప్రభుత్వముగల కవి పై వర్ణనములం దెక్కడను వెనుక బడలేదు. ఈతడు మను, వసు చరిత్రముల నాదర్శముగా దీసికొని తన కావ్యమును నిర్వహించినాడని కథా సంవిధానమును బట్టియు, ఆయా వర్ణనములను బట్టియు బాగుగా నిర్ణయించుకొనవచ్చును. శాతుసరూప గంధర్వ శాపవిమోచనము మనుచరిత్రము బట్టి కల్పించినదే యనవచ్చును. కవికిగల వర్ణనావ్యసనముచేతను, శబ్దాలంకారతత్పరత్వముచేతను అటనట రస ప్రతీతి భంగముగుట తప్పలేదు. నాయికా నాయకుల నొక్క రంగముపై నన్యోన్యము మాట్లాడించిన బాగుండెడిది. ఈ కార్యమంతయు సేవలము చెలికత్తెయే నిర్వహించుట రసజ్ఞులు తలలూపలేరు. అయినను కావ్యము మనోహరత్వమునకు దూరము కాక కవిని చిరంజీవిని జేయగల్గియున్నది. పుర వర్ణనములో—

"కాలగళుడు దక్క, గాముని గెలిచిన
వారలెవ రిటంచు వసుధలోన
జక్కదనముచేత నిక్కుచునవ్వీట
మరుని గెలువనట్టి మనుజుడెవడు ?"

అని పురుషసౌందర్యము నొక్కమాటలో జెప్పినాడు—వనవర్ణనములో—

"శోకనుయావనంపుదళి
సొంపలరన్ హిమవారిధారి, కా
రాకుల మైల లూడ్చి బెడ
గైన సుఖచ్ఛదంబులందు మా
జాకుల కావికోక లల
రారగ దాల్చిన కీరభూషణా
స్తోకలు గొమ్మలయ్యెనిలు
తోదని పెన్ గొనసాగు కొమ్మలన్"

ఇంకను శ్లేషరూపక సంపత్తితో సొంపైయున్నది. తాపసుల ధైర్యము తరుణులచే దూలిపోవుననుటకు—

భామలతో కూర్పుమన్ ప్రఖిద కాభేయమై
వరప త్తిగుణమును వ త్తిగలిగి,
సుక్తికాంతా స్నేహమున బ్రజ్వలించుచు
ఘనతరమాయాంధకారమడచి,

యరివర్గశలభ సంహారంబొనర్చుచు
సాత్మీయ దేహాలయాంతరమున,
నలఘప్తభూమికలను మెట్లపై బుధ
రావృత్తివిరహితం బనెడికుదుట
బ్రశయజంఝానిలంబున మలగనట్టి
దివ్యయోగీంద్రసుజ్ఞానదీపకళిక
పొలతి నెమ్మేని గాలి చేమలసుకతివ
చారి మునికి దపోవిఘ్న కారిణిగద!

"కచ్ఛపాల్గట్టు నీ మునిద్రుచ్చులెల్ల దామరస నేత్రలింద్ల బందాలుగారె" అను పెద్దన్నగారి భావమిందు సుందరముగా పరిపుష్టమైనది. సందర్భమునుబట్టి రెండును రెండుత్రోవలు ద్రొక్కినవి.

"అసురాకొంజసురాకుల
నసురాకొమరితె పదమ్మనఖరుచికల్మిన్
దసురా నీలపు రాజిగి
తసురా సుతివాలుకురుల తతులకు సరిరై."

ఈ పద్యము చేమకూరవారి "అన్నన్న మొగము వెన్నెనియున్నన్న" అను దానిని బోలియున్నది. చంద్రోదయవర్ణనము

"పూర్వశృంగఖరము బూని యక్కనగాలు
వలయజంద్రపాండు వృషమువెనలె
గగనకోననమున గన్పడుచుక్కల
మందగలియుటకు నమందలీల."
"తగకరస్పృష్ట సత్కౌస్థానరైని
లీనతారకరై వికశితతమోవి
నీలకచపాశరై యతిలోలచక్ర
కుచయుయిచెలంగె నిశి రాజు గూడుకతన."

పై వర్ణనము లెంతయు సుందరములుగదా! ఇంత వర్ణించియు దివగోత్ర బుషులకు జనకుడగు సృష్టికర్త విశ్వకర్మను బ్రశంసింపకుండుట కవి కిష్టము కాలేదు కాబోలు! మన్మథ దూషణములో నాతని టెదీర్చుకొన్నాడు—

"అరసీయ కారణంబయిన
యోగ్రగహ మూసెదవంచు నీకుగా
విరులశరమ్ము, లిక్షుపువ
విల్లను, వారిని దేటిబారుచే,
విరహుల పాలి దైవముయి
విష్టపసన్నుతి విశ్వకర్మతా
బరగ సృజించె నాతనికి
బ్రాంజలిసేయగవచ్చుమన్మథా!"

కవి శృంగారప్రబంధమును వ్రాసినను వేదాంతపరత్వ మెక్కుడుగా గలవాడు. కావున వర్ణన సందర్భముల నయ్యెయెడల నది వ్యక్తమగు చున్నది. ముక్తాహారము మెడలో బడినపిదప దాని నుద్దేశించి బుధుడు—

"తారకసాంఖ్య యోగముల
దాల్చుసుసూత్రము సేత దాటి సం
సారపయోధి గాంతకుద
సంతతసౌఖ్యము గాంచితీవు నీ
భూరికృపా విశేషమును
బొందక తొద్భశ భూతియబ్బునే
తారక సాంఖ్యయోగముల
దాల్చినయంతనె తారహారమా!"

అని శ్లేషించి చాతుర్యముగా బలికినాడు. ఈతడీరీతి వర్ణించిన యద్భుత వర్ణనములు పెక్కులు గలవు. విస్తర భయమున నొండురెం డుదాహరించి విరమింతును. అంధకార వర్ణనము—

"తనరల్ని మబ్బిజా అనేని కోకిలుమిన్ను
సిరి సేల జీరాడు కురుల సుమిరొ,
పుడమి పాంథుల నేచ బెడలమారుదుత్రుప్పు
దుడిచి పెట్టిన నల్లతో గలరుచియొ,
యపరాహ్ణమున మకరాలరేకుదుగ్రవేల్పు
మహిత నిత్యాగ్ని ధూమవ్రజంబొ"

చుక్కల వర్ణనము—
"కడలు మిన్నంటి పెంపడరు చీకటిప్రాను
చివరబుట్టిన వెల్లపువులనంగ,
ఆకసం బరయ శ్రీహరి పదాభ్యవహించు
కతమున వెలుగునఖరములనగ

రిక్కగమి యొప్పె కాంతులు పిక్కటిల్ల."

కథా ప్రకల్పనాచాతుర్యమునకన్న నిందు వర్ణనల మహిమము మిన్ను ముట్టుచున్నది. ఎంత వర్ణించినను విసుగు బుట్టనీయక పాఠకు నాకర్షించి శ్రోతలోచల ద్రిప్పుట కతడు మేటియైయుండును. దీర్ఘ సమాస రచనము సేయుటకుగాని, అలతిపదములతో పద్యముగూర్చుటకుగాని యాతడు చాలినవాడు. సీస ముల నొయ్యారముమీర, సమతాగుణముతో సరసంపు

